# కుసుమాంజలి

కొమాండూరు
కృష్ణమాచార్యులు

1923

సాహితీ సమితి
తెనాలి. గుంటూరు. బెజవాడ

THE ANDHRA BOOK HOUSE,
SULTAN BAZAR, HYDERABAD-DN.

# విషయసూచిక

# సమర్పణము

భావమునందు మాధవుకృపారసవృష్టిఁ గవిత్వవల్లికల్
పూవులు పూయఁ దత్ప్రసవపుంజము లంజలిలోనఁ బట్టి మీ
పావనపాదపద్మములపైని ముదంబునఁ గూర్చుచుంటి స
ద్భావముతోడ నోజనక! పాయని ప్రేమఁ బరిగ్రహింపుమా!

# పాదుకాస్తవము

శ్రీ వైకుంఠ వియత్ స్థితంబు ఘనలక్ష్మీవిద్యుదుద్దీపిత
శ్రీ వత్సాంకము దివ్యశంఖరవ సుస్నిగ్ధోరు ఘోషంబు నా
శ్రీ వైకుంఠ వలాహకంబు జనసంసేవ్యంబు భక్తాళి స
ద్భావక్షేత్రములం గృపారస మహావర్షంబు వర్షించుతన్!

భరత కుమారుమౌళిపయి భాసిలురక్తజటాకలాపమం
దరుణ సహస్రభాను నిభమై వెలుఁగొందెడు నెద్ది జానకీ
కరకమల ప్రమృష్ట మయి క్రాలెడు నెయ్యది యట్టి రాఘవ
స్ఫురదురుపాదుకాద్వయము ప్రోచెడుఁగావుత భక్తసంతతిన్!

ఉత్తరకోసలేశ్వరు మహోజ్జ్వల పీఠముపై వసించి యు
త్కృత్తమలీల రాజ్యము చతుర్దశ వత్సరముల్ ప్రజాళి కే
యొత్తిడి లేక యేలిన రఘూద్వహు దివ్యసువర్ణపాదుకల్
చిత్తములోన నిల్చెద నశేషశుభప్రతిపాదనార్థమై!

బలి దైత్యేంద్రు కిరీటరత్నములపై బ్రహ్మాండభాండంబుపై
నలప్రహ్లాదుపవిత్రమూర్ధమునయిన్ హస్తీంద్రుమస్తంబుపైఁ
జెలు వొప్పన్ విహరించు రత్నఖచిత శ్రీపాదుకాదీప్తి మా
కలుషవ్రాత మహాతమిస్రపటలిన్ ఖండింపగాఁ జాలదే?

ఓ మణిపాదుకాద్వయ, త్వదుజ్జ్వల వృత్తమె చేయఁగోరి సీ
తామహిళాలలామ పతి దండకభూములఁ కేగునాఁడు " మీ
కోమలపాదపద్మములఁ గ్రూరకుశాగ్రము లొత్తకుండ శ్రీ
రామ, భవత్పథంబు సుకరంబుగఁ జేతు" నటంచుఁ బల్కదే?

హేమమణిపాదుకాద్వయ, త్వదీయరజః కణలేశముల్ శిర
స్సీమలఁ దాల్చువారె కడుశీఘ్రమునం గమలాయతాక్షు నా
భీమహితాబ్జరేణు మయపీఠికపై వసియించుచున్నవా
రే మని చెప్పనొప్పును త్వదీయపరాగ మహాప్రభావముల్!

ఆ యహల్యాదేవి యవయవ నిర్మాణ
 పరమాణు కణములై పరఁగె నెవ్వి
భరతు జటాజూట పటలియం దెయ్యవి
 పద్మరాగారుణ ప్రభల నీనె
అల విభీషణు కిరీటాగ్ర రత్నములందుఁ
 బ్రతి బింబరూపమై పరఁగె నెవ్వి
రాధా పయోధరాగ్రములయం దెయ్యవి
 కస్తూరికా రజఃకణము లయ్యె

గారుడస్కంధ పీఠిపైఁ గ్రాలు నెవ్వి
శేష భోగీంద్రు మేనికి భూష లెవ్వి
అట్టి హరిపాదుకా పరమాణు కణము
లస్మదాదుల కాశ్రయ మగునుగాక!

# మేఘస్వాగతము

శ్రీసమాశ్లిష్టగాత్రుఁడౌ శ్రీనివాసు
లీల సౌదామనిని గూడి నీలమేఘ,
గగనభాగమునందు లోకములు గావ
నేగుతెంచిన నీ కిదె స్వాగతంబు
కుటజకుసుమాంజలులతోడఁ గూర్చిపాసు
చెంచు ముగ్ధియ లయ్యవి స్వీకరింపు!

ప్రబలషడ్జస్వరంబున వనమయూర
బృందములు పాడుచున్నవి విజయగీత
ములను; వీక్షించుచున్నారు ముగ్ధలైన
పల్లె పడుచులు కృషిఫలభార మెల్ల
నీయదిమె యంచు మొగ మెత్తి నిశ్చలాక్షి
యుగ్మకంబుల; వనగజయూథనాథుఁ
డాటవిక మార్గమున నేగునపుడు నీదు
స్నిగ్ధ గంభీరఘోషంబు చెవిని బడిన
సరభసంబుగఁ బ్రతినాగ శంకచేతఁ
దిరుగుచున్నాఁడు యుద్ధంపుదీక్షఁ బూని.

అద్రి శృంగాగ్రవర్తియగు హరికిశోరుఁ
డభ్రమున నున్న నినుఁ జూచి హస్తి యనుచు
నగ్రపాదావలేపన వ్యగ్రుఁ డయ్యె.
వింధ్య పర్వత శిఖరం బవంధ్య గతిని
జండమారుతశక్తిచేఁ జదల నేగెఁ
జూడుఁడీ యంచు నినుఁ జూచు సొగసుకత్తె
మౌగ్ధ్యమున కల్లసల్లన మందహాస
వదనుఁడై చూచుచున్నాఁడు వల్లభుండు.

అశని నిర్ఘోష భీతిచే నబల లిపుడు
భర్తల కొసఁగు చున్నారు పడయరాని
గాఢ భుజబంధసౌఖ్య మకాంక్షితముగ.
భవదుదర నిర్గతంబు లౌ వారికణము
లమల పత్రపుటంబుల నాశ్రయించి
భూరి ముక్తాఫలంబులు వోలె మెఱయఁ
బాన మొనరించు చున్నపి పక్షితతులు.

దేవతాస్త్రీల హారమౌక్తికము లవియె
రతిరభస మర్దితంబులై రాలె ననుచు
వారిధారలఁ గవిసార్వభౌము లిపుడు
వర్ణనము సేయుచున్నారు; భ్రమర తతులు
స్థూలవర్షాంబుధారల స్రుక్కి స్రుక్కి
మధుర కుసుమాసవాస్వాద ముదము వదలె;
అదె వియద్గాంగ ఫేన శుక్లాంగకములై

# సికందరు

ఆఫ్రికాఖండమందలి యడవులందుఁ
బ్రళయ భానుని పగిది నభఃస్థలమున
వెల్గుచున్నాఁడు మధ్యాహ్న వేళ సూర్యుఁ
డపుడు ప్రావృట్పయోదనాదానుకారి
సమద కంఠీరవారావ సదృశ ఘోష
మొక్క మొగి మ్రోసెఁ బటహ తూర్యోగ్రరవము.
పాఱుచున్నవి మృగములు భయముఁ జెంది
ఘర్మసంతప్తుఁడై తటాకంబునందు
మున్గి యున్నట్టి గజరాజు మొగము నెత్తి
సరభసంబుగఁ బ్రతినాగశంక చేత
వచ్చుచున్నాఁడు యుద్ధంపువాంఛఁ బూని.
వనమహిషబృంద మొకటి పల్వలము వాసి
శితవిషాణాగ్రముల శిలల్ చిమ్ముకొనుచు
ధరణి కంపింపఁ బాఱెడు దశదిశలకు.
గిరి గుహాంతస్థ గంధేభ ఘీంకృతులకుఁ
బ్రతినినాదము లొసఁగెడుఁ బర్వతములు.
నెమగు వేయుచుఁ బచ్చిక నేల మీఁదఁ
జెట్లనీడల విహరించుఁ జిన్నిలేళ్ళు

పరుగు లెత్తెడు దిశలకు భయముఁ జెంది.
చల్లని తమాల భూరుహ చ్ఛాయలందు
గుఱ్ఱు వెట్టుచు నిద్రించు ఘోరసింహ
మదరి పడి లేచి వాల మల్లార్చుచుండె.

గగన మంటెడు ఘనపతాకములతోడ
వచ్చుచుండె సికందరు వాహినులును.
నేల యీనినరీతిని నిండిపోయె
ధరణి యంతయు సైనికోత్తములతోడ.
వాహినీమధ్యమున నున్న భద్రగజము
నధివసించి మహావీరుఁ డగు సికంద
రల్ల నల్లన నరిగెడు నతని సైన్య
మంతయును ఘర్మతాపార్తి నడుగు లిడగఁ
జాలకుండిరి, యది చూచి చక్రవర్తి
విడియ నియమించె వాహినీవిభుల నచట.

దూరమున నున్న శాల్మలీద్రుమముక్రింద
పురుషుఁ డాయసపరిఘపీవరభుజుండు
బాణబాణాసన కృపాణపాణి యొకఁడు
మసృణవేణీ సవర్ణుండు మసలుచుండె.
భద్రదంతావళముపైని పార్థివేంద్రుఁ
డతనిఁ దోడ్కొని రం డని యంపె భటుల,
వా రరిగి వానిఁ దోడ్కొని వచ్చి రపుడు.

అతనిఁ జూచి యలెగ్జాండ రనియె నిట్లు:
"నాదుసైనికు లందఱు నడచి నడచి
యలసి యున్నారు దప్పిచే ననఘ, యిపుడు
స్వాదు జలపూరితం బైన సరసి యొకటి
యెంత నుండిన వేగమె చెప్పు!" మనినఁ
బల్కె వాఁడును గంభీర భాషణముల.

"ఓమహీనాథ, యీసమీపోర్వియందు
వజ్రధారాహతం బైన వటముచెంత
కదళికాషండ మొక్కటి గలదు దాని
మధ్యభాగంబునందున మణివిభంగ
నిర్మలాంభః ప్రపూర్ణమై నెగడుచుండు
స్వాదు సలిలాశయం బుండుఁ బార్థివేంద్ర!
భటుల నెల్లర విడియింపఁ బంపు మచట.
కడు బడలినాఁడ వీవును గాన యిపుడు
రమ్ము నా వెంట నోమహీరమణ!" యనుడు
నల్పపరివారసహితుఁడై యరిగె నతఁడు.

అట్టు లొకక్రోశమాత్ర మా యవనినాథుఁ
డరుగఁ దరుషండ పరివృతం బైన యొక్క
యడవిపల్లియ పొడసూపె నతని కపుడు.
మాధురపిక శారికా గీత మధుర గుణము
లవని విభునకు శ్రోత్రపేయంబు లయ్యె.

ఘన కపోతాంగ సదృశ మగు కాంతిఁబోడ
వృక్షశాఖల ధూమ మావిర్భవించె.
భగ్నకంఠధ్వనులతోడఁ బర్ణశాల
లెక్కి కూసెడుఁ గృకవాకు లింపెసంగ.

అచటిపర్ణకుటీరంబు లచటివీథు
లచటివారల వేషంబు లతఁడు చూచి
స్నిగ్ధభిన్నాంజనప్రభా నీలతనుల
వారలను సేవగించుచు వసుమతీశుఁ
డరుగుచుండెను బూరుషు ననుసరించి.

వాఁడు వారలయేలికపర్ణశాల
కవనినాథుఁ గొనిపోయి యచట నొకని
శీతలోపలవేది నాసీనుఁడైన
పురుషు నున్నతదేహుని భూరిబలునిఁ
గరి కరోపమ బాహుని ఘనవిశాల
వక్షుఁ గాలాభ్రసమవర్ణు వనజనేత్రు
నతఁ డలెగ్జాండరుకుఁ జూపి "యనఘ, యితఁడు
అస్మదాదులఁ బాలించు నడవిఱేఁడు."
అనుచు జోహా రొనర్చె నా యాటవికుఁడు.

పార్థివేంద్రునిఁ జూచి యావనచరేంద్రుఁ
డాసనం బిచ్చి స్వర్ణమయంబులైన
ఫలము లుంచిన యొకపైడిపళ్ళెరంబు

నతనిముందర నుంచి "యోయవనినాథ!
వీని భుజియింపు మాకలిపీడ వోవ,"
ననిన నాశ్చర్యమగ్నుఁడై యవనివిభుఁడు
"స్వర్ణమును దింట యిచటియాచార మొకొ్కొ?"
యనఁగ వనచరనాథుఁ డిట్లని వచించె:

"కలదు భుజియింప మీాదు భూఖండమందు
షడ్రసోపేత మైనభోజనము కాన
ధనము నార్జింప వచ్చినఘనుఁడ వనుచుఁ
దలఁచితిని వేఱుకాదు భూతలమహేంద్ర!"

అనఁగ విని యాసికంద "రోయడవిఱేఁడ!
స్వర్ణమున కాస పడలేదు సత్య మింత.
ఇచటివారల యాచార మిచటివిషయ
మరసిపోవంగ వచ్చితి," ననిన నాతఁ
"డిచ్చ వచ్చిన యన్నినా ళ్లీధరిత్రిఁ
గ్రుమ్మఱుము సార్వభౌమ, నీకోర్కె దీర!"

అనుచు సల్లాప మొనరించు నాక్షణమున
అచటి కిరువురు వచ్చి యాయడవిఱేని
మ్రోల సాగిలఁబడి లేచి "భూమిపాల!
మా తగవు దీర్పు వినుము మా మనవి యిదియ,"

అన్న నొక్కని వచియింపు మనియె ఱేఁడు,
పల్కె వాఁడును గంభీరభాషణముల:

"క్రయమునకుఁ గొంటి క్షేత్ర మీఘనునియొద్ద
సేద్య మొనరించుచుండ నాక్షేత్రమందు
స్వర్ణనిష్క ప్రపూర్ణ సువర్ణఘటము
హాలమునకుఁ దాఁకె నది గొని యతిరయమున
నితని గృహమున కేఁగి నే నిచ్చినాఁడ.
కొనఁ డదేమి విచిత్ర మో కువలయేశ !
కనక భాండంబు నాయది గాదు సుమ్ము,
పుడమి మాత్రమె కొంటి నీ పురుషు నొద్ద.
ఇతని కెటులైన భాండ మిప్పించు దేవ ! "

అనఁగ రెండవవానితో నడవిఱేఁడు
"చెప్ప నేదేనిఁ గలదేనిఁ జెప్పు," మనియె.
అతఁడు వచియించె నిట్టులు:
"ఓ యధిప, వినుము

క్రయమునకు క్షేత్ర మిచ్చితిఁ గల్ల గాదు.
పొలము నమ్మిన యపుడె యీపూరుషునకు
నిధులు నిక్షేపములుగూడ నే నొసఁగితి.

కాన నాయది యెట్లాను గనకఘటము?
న్యాయమూర్తివి గావున నయముతోడ
నతని కెట్టులైన నిప్పింపు మనఘ దాని."

వారిరువు రిట్లు తమతమ వాదములను
నధిపుముందర వినిపింప నతఁడు గొంత
తడవు యోజించి పల్కె:
'ఓతమ్ములార!

న్యాయము వచింతు వినుఁడిదె నయముతోడ
కలఁడు నీ కొకపుత్త్రుండు కల దితనికిఁ
బుత్త్రికయుఁ బెండ్లి గావింపఁబూనుఁడింక
స్వర్ణభాండము పెండిలిసమయమందు
వారి కొసఁగుఁడు మీ కింక వాదమేల?
పొం' డని వచించె నప్పుడా పుడమిఱేఁడు.

వీరి తగవును దీర్పును విని సికంద
రద్భుతం బందె నది చూచి యడవిఱేఁడు
'సార్వభౌమ, యిదేల విస్మయము చెందె
దస్మదీయ విచార మన్యాయ మొకొ?
నీదు రాజ్యంబునందున నీవు చెప్పు
న్యాయ మెట్టులో?' యన్న భూనాథుఁ డనియె:

,,ఇర్వురను మేము బంధింతు మింత నిజము!
స్వర్ణ నిష్క్రపూర్ణ సువర్ణఘటము
పార్థివేంద్రుఁడు గ్రహియించుఁ బరులు గొనరు.''

అనిన నాశ్చర్య మగ్నుఁడై యతఁడు పలికె:
,,అకట! మీ దేశమందు సహస్రభానుఁ
డుదయ మొందునో పందునో యుర్వి యచట
విషఫలంబులు గాక మీవృక్షములకు
మధురఫలములు గలుగునో మనుజనాథ!''

నావు డిట్లని పల్కె నా నరవరేణ్యుఁ
,,డన్నియును గూడ మా దేశమందుఁ గలవు.
సస్యసంపూర్ణ యగును మాక్ష్మాతలంబు
లేదు మా కెట్టి కొదువయు లేశమైన.''

అనుడు మరల వచించె నా యడవిఱేఁడు:
,,పచ్చికలు మేసి నిర్ఝరవారిఁ ద్రావి
క్షీరముల నిచ్చుపసులు మీ క్షేత్రములను
గల వొకో?'' యనఁ బెక్కులు గల వటంచు
నపు డలెగ్జాండ రనుటయు నతఁడు పల్కె:

,,సాధుమృగములఁ బోషింప సర్వవిభుఁడు
భాస్కర మరీచులను మీకుఁ బర్వఁజేసె.

వారిధరములు వర్షించు వానికొఱకె
పుడమి పండుట మృగముల పుణ్యముననె.
కటకటా! లోకమున నిట్టికఠిన హృదులు
ఎంద ఱున్నారో యెఱుఁగఁగా నేరితరము!
ఈశ్వరుఁడు వారి నెట్లైన నేలుఁగాత!”

అనుచుఁ జింతాకులస్వాంతుఁ డైనఁ జూచి
మాఱు మాటాడుటకునైన నోరు రాక
కదలి పీఠమునుండి సికంద రపుడు
సిగ్గుతో నిజవాహినిఁ జేరఁబోయె!

# పురుషోత్తమదేవుఁడు

౧

నీలనీరద మహా నిబిడాంధతమస
మావరించె దిశాచయమ్ముల నెల్ల
ప్రళయభైరవ మహాపటహోగ్రరవమొ
ఘూర్ణమానార్ణవ ఘోరనాదంబొ
యనఁగ దిగంతంబు లద్రువంగ మ్రోసె
నిబిడకాందబినీ నిహ్రాద మపుడు.
ప్రబల జంఝూవాత పతితంబు లగుచు
ధర రాలు భూరుహాధ్వానంబు లొప్పఁ
గాలాహిచయములఁ గట్టినయట్లు
గురియుచున్నది మహాఘోరవర్షంబు.

ప్రబల ఖురన్యాస పటుఘట్టనముల
రాజమార్గంబులు రవ్వలు గ్రక్క

హేమ లాశాసదేభేంద్రకర్ణముల
ప్రక్కలు గావింప వదనంబులందు
శ్రమమున ఫేనముల్ సందడి గొనఁగ
బటుఖలీనంబులఁ బటపటఁ గొఱికి
చటుల గ్రీవాభంగ సౌందర్య మొప్పఁ
బవనవేగంబునఁ బఱతెంచుచున్న
పారసీహయములఁ బ్రౌఢిమై నెక్కి
నిజదీర్ఘ శూలాగ్ర నిర్వామద్వహ్ని
శిఖల శంపాలతల్ సిగ్గు వడంగ
ముఖమున ఘర్మాంబు పూరంబు లొదవ
నుష్ణీషధారులై యుత్తమాశ్వికులు
పటు రయంబున రాజభవనంబుఁ జొచ్చి
పురుషోత్త మాధీశు భూరిసంస్థాన
మంటపంబు సువర్ణమణి చిత్రితంబుఁ
జేరంగఁ జని ద్వారసీమఁ దురంగ
పృష్ఠావతరణంబు పృథులవేగమునఁ
గావించి సామంత ఘనరత్నమకుట
రంజితపాదుఁడై రాజిల్లువాని
కమలపత్రవిశాల కాంతలోచనుని
ఆజాను దీర్ఘ బాహార్గళద్వయుని
రాజ్యలక్ష్మీదివ్య రత్నపీఠంబొ

యనఁగఁ జూపట్టు మహాపీనవక్షుఁ
బుడమి సప్తద్వీపములఁ బూని యేలఁ
గలుగు మహారాజ ఘనలక్షణాఢ్యుఁ
దప్తహాటకవర్ణుఁ దామ్రారుణోష్ఠు
ఘన నీలకుంతలుఁ గమనీయ మకుట
మాణిక్య రంజిత మౌళిశోభితుని
జాంబూనద త్సరు చండ కృపాణ
శోభిత కటిభాగు శూర శేఖరుని
చారు చామీకర చామరా చలిత
చూర్ణ కుంతలు మహాసుందరమూర్తిఁ
బురుషోత్తమ నృపాలు మొక్కి యిట్లనిరి:
"గ్రీకు దేశాధీశ గ్రీష్మభానుండు
నిజవిక్రమానల నిర్దగ్ధవైరి
వీరరాజన్యుండు విఖ్యాత యశుఁడు
పాశ్చాత్య భూపాల వర కిరీటాగ్ర
మాణిక్య రంజిత మహితాంఘ్రితలుఁడు
కదన భూతల వీర కదళికాషండ
ఖండన చణ మహా ఖడ్గహస్తుండు
రాజమాత్రుఁడె రాజరాజేశ్వరుండు
నిజ జయస్తంభముల్ నిఖిల దేశముల
నిర్జరుల్ మెచ్చంగ నిల్పినవాఁడు

ఘనుఁడు సికందరు గంభీరమూర్తి
నిజబలంబుల నేల నింగియు వడఁకఁ
బాంచాలదేశంబుఁ బట్టుదు నంచు
"జీలం" నదీతీర సికతా తలముల
విజయాభిలాషియై విడిసియున్నాఁడు!
రణభూతలంబున రఘురాముఁ బోలి
పరిపంథి పాథోధి బడబాగ్ని యైన
పురుషోత్తమనృపాలు ముందర నిల్చి
కదనంబు సేయగాఁ గాలు ద్రవ్వెదరు
గౌరాంగు లిప్పుడు కడుమోదంబునను!
మీఁదటికార్యంబు మిహిరకులేంద్ర!
ఆనతిం!" డని యిర్వు రాశ్వికు లపుడు
పాణియుగ్మముఁ జేర్చి ఫాలంబులందుఁ
దత్సభామంటప ద్వారదేశమున
నిలిచిన సభయెల్ల నిస్తబ్ధ మయ్యె!

ఘోరి పల్కులు విని వసుధాధవుండు
శాత్రవా గమనంబు సైరింపలేక
యాక్షణాంచలముల నీరెండ గాయ
గ్రావాగ్రముననుండి కరివైరిలీల
జలధర నిర్ఘోష సదృశ రావమున
సామంతభూపాల సంఘంబుఁ జూచి
భానువంశజుఁ డిట్లు పలుకంగఁ దొడఁగె :

"అగు నెఱుంగుదుఁ గొంత యతని వైభవము
వీరవరేణ్యుండు విఖ్యాతయశుఁడు.
కాని రాజ్య మొసంగి కాళ్లు బట్టంగ
క్షత్రిబంధుఁడు రాజచండాలుఁ డైన
తక్షశిలాపుర ధారుణీశ్వరుఁడు
కాఁడు సుమ్మా రాజకంఠీరవుండు!
చతురంగబలముల నతిశీఘ్రగతిని
అయిత మొనరించి యవనసైన్యములు

"జీలం" నదిని దాటి చేరి రాకుండఁ
దత్తీరసైకత స్థలములయందు
నిలుపఁగా వలె సైన్య నివహంబు నెల్ల.
ఎల్లి ప్రొద్దున మన మేఁగంగ వలయు
నతిరయంబున!" నని యానతి యిచ్చి
కొలువు చాలించి యా కువలయేశుండు
కైలాసగిరివోలెఁ గడురమ్యమైన
ప్రాసాదమున కేఁగెఁ బల్వాగు కొల్వ.

3

మందేహదనుజ నిర్మథనోద్యమంబుఁ
బూని యుష్ణాంశుఁడు పూసినరక్త
చందన చ్ఛాయలు చదలఁ బర్విడెనో
తప్త జాంబూనద ద్రవలిప్త మయ్యెఁ
గాఁబోలు నుదయాద్రి ఘనకూట పటలి
యనఁగ నభోవీథి నంతట నెగడె
నరుణ బాలాదిత్యు నంశుజాలములు.
అండజ సంతతు లవ్యక్తమధుర
నాదంబు లెసఁగంగ నభమున నెగసి
బద్ధమాలాకార భాసురలీల
ధాన్యమంజరులకై తగఁ బాఱునపుడు
చిత్రవర్ణగరు ద్విచిత్రితం బగుచు
నాఖండలునిచాప మడరినరీతి
వివిధవర్ణంబుల వినువీథి మెఱసె.
శ్యాదలభూమిపై జలకణావ్రాత
మాణిముత్తెములట్టు లపుడు చూపట్టె.

తత్ప్రభాతంబునఁ దలరంగఁ జొచ్చెఁ
బురుషోత్తముని సేన పుడమి కంపింప;

మంథాచలక్షుబ్ధ మహితార్ణవంబు
కైవడి నభము గ్రక్కదలంగ మ్రోసెఁ
బటహ నిస్సాణాది భైరవధ్వాన;

మంజనాచల సమూహంబులో యనఁగ
గజతండములు నిజఘంటానినాద
మాశామదేభ కర్ణాంతరక్షోభ
మావహింపగఁ బదన్యాసభారమున
శేషభోగీంద్రుండు శిరములు వంప;
ఆయసముసలముల్ హస్తంబులందు
లయసమవర్తి దండములట్లు మెఱయ
ఆరోహకుల యంకుశాస్ఫాలనముల
నిజతుండముల నెత్తి నింగి కంపింప
ఘీంకృతుల్ సలుపుచు గెలఁకుల నడువ;

నడుమ వింధ్యాచలోన్నత మైనదాని
కనకఘంటాంచిత కంఠంబు దాని
హాటక వలయ మహాభీల దంత
కాంతుల చంద్రికల్ గాసెదు దాని
పాదలగ్న సువర్ణవలయముల్ మెఱయఁ
జరణ విన్యాసంబు సల్పెడు దాని

పాటల బిందు సంభావితంబైన
వెడఁద ఫాలముతోడ విలసిల్లుదాని
హైమరాజత చిత్రితాంబరస్ఫూర్తి
ధాతుమండిత మైన ధరణీధరంబు
కైవడి విలసిల్లు గంధసింధురము
నధివసించి నృపాలుఁ డాయతభుజుఁడు
హిమపాండు రాతపత్రేందుమండలము
శిరమున వెలుగంగ శీతాంశుముఖులు
కంకణఝుంకృతుల్ గ్రాలఁ జామరము
లల్లనల్లన వీవ నరుదెంచుచుండె.

ఆరట్ట పారసీకాదిదేశముల
నుద్భవిల్లిన యట్టి యుత్తమాశ్వముల
పై నెక్కి రౌతులు పార్శ్వంబులందుఁ
జటులవేగంబునఁ జనుచుండి.

రంత

బాణబాణాసనపాణులై యెదుట
రథికులు మనమున రణకౌతుకంబు
సందడి గొనఁగ నుత్సాహంబుతోడ
నరుగుచుండిరి. వారియందఱ పిఱుఁదఁ
గరవాలములు పూని గర్వోక్తు లెసఁగఁ
గాలుబలంబులు కడువడి నడచె.
సైన్యంబు లిట్లతి సరభసవృత్తిఁ

దన్నదీ సైకతస్థలములఁ జేరు
వఱకు నవ్వలియొడ్డుపైఁ గాననయ్యెఁ
దపనీయ కలశాంచితంబులై మెఱయు
పటకుటీరంబులు భాసురలీల.

నేల యీనినయట్లు నిండె సైన్యములు
కాంస్య శిరస్త్రాణకాంతులు వెలుఁగ
కార్ష్ణ్యాయ సోజ్జ్వల కవచము ల్మెఱయ
నుత్ఖాత ఖడ్గులై యుగ్రసైనికులు
అప్రమత్తత బలం బరయుచునుండి.
రటఁ బురుషోత్తముఁ డాత్మవాహినుల
విడియించె నప్పుడు విన్నాణ మొప్ప.

౪

అది జలదాగమం బగుట నభంబు
నీరంధ్రముగ నిండె నిబిడాంబుదములు.
హైమ విద్యుత్కశాహతిని మేఘములు
సైరింపనట్టుల సాంద్రఘోషంబు
దిక్తటంబుల నత్యుదీర్ణమై నెగడె.
ఉదయాస్తసమయములు నొక్కటి గాఁగఁ
బర్వెఁ గాదంబినీ బహుళాంధతమస
మనవరతంబు వర్షాంబుధారార్ద్రి
తంబులై సైన్యముల్ తడఁబడఁ జొచ్చె.
పూర్ణప్రవాహమై పొదలె నదంబు
కాల్నడ లన్నియుఁ గదియ రాకుండఁ
బురుషోత్తముఁడు నిల్పె భూరిసైన్యముల.
పంకసంకలితమై పరఁగెఁ గూలంబు
అయలెగ్జాండరు హయతతికి పుడు
సామజమద గంధి సాంద్రమారుతము
కడు నసహ్యం బయి క్రాలెడుకతనఁ

బూర్ణవాహినియందుఁ బోవంగ లేక
ముందంజ వేసిన మున్నున ట్లుండె.
పురుషోత్తమాధీశు భూరిసైనికులు
శరచాపహస్తులై సర్వకాలములఁ
గంటికి ఱెప్పగాఁ గాచుచుండి
రాకతంబున దాట నలవి గాదయ్యె
నాసికందరునకు నమ్మహాతటిని.

"ఇమ్మహావాహిని నిపుడు దాఁటంగ
సమయంబు గా" దని సంగ్రామవిదుఁడు
గ్రీకు భూనాథుండు కృత్రిమోపాయ
మొక్కటి మదిలోన నూహించి యచట
బహుకాల ముండెడివాని చందమున
ధాన్యాది భోజన ద్రవ్యసంతతులు
సమకూర్చి శత్రువంచన మొనర్పంగఁ
బ్రతినిశాసమయంబు బలముల నెల్ల
సంసిద్ధ మొనరించి సాంద్రవేగమునఁ
బటహ నిస్సాణాది వాద్యముల్ మ్రోయ
వాహిని వడి దాఁటు వాని కైవడిని
యత్న మొనర్పంగ; నాయత భుజుఁడు
పురుషోత్తముఁడు తనభూరిసైన్యముల
వ్యూహంబులుగ నిల్పి యుద్ధసన్నద్ధు

డగుటయు నది చూచి యాయలెగ్జాండ
రతిభీతిఁ జెందిన ట్లాత్మసైన్యముల
విడియుంగ నియమించి వెనుకంజ వేయు.

కొన్నినాళ్ళరీతిఁ గువలయేశుండు
పురుషోత్తముని మోసపుచ్చుట కతన
“అతిభీతిఁ బాశ్చాత్యుఁ డడలుచున్నాఁడు
సమరంబు సేయఁగఁ జాలఁ” డటంచుఁ
బొఱవడి యుండెను బురుషోత్తముండు.

౫

ఒక యమవసనాఁటి యుగ్రనిశీథ
మున మేఘతతులు నభోవీథి నెగడె.
నిమ్నోన్నతంబుల నిశ్చయింపంగ
శక్యంబు గాకుండ సాంద్రతమంబు
లాక్రమించె నభోంతరాళంబునందు.
కౌశికఘటల ఘూత్కారముల్ సెలఁగ
కాతరస్వాంతముల్ కడుభీతి నొందె
తత్ప్రాంత కాంతార తలములనుండి
వ్యాఘ్రమహార్యక్షాది భయదసత్వముల
గర్జితరవములు గాఢమై పర్వె
జగమెల్ల నిద్రావశం బయి నెగడె.

అట్టి యద్దమరేయి నాయలెగ్జాండ
రాత్మీయసైన్యంబు నాయిత పఱచి
శిబిరంబు రక్షింప సేనలోఁ గొంత
భాగ మచ్చట నిల్పి పడవల నెల్ల
ప్రాంతాటవులలోనఁ బదిలంబు చేసి

నిశ్శబ్దముగ సైన్యనివహంబు నెల్ల
నదికి దూరంబుగా నడిపించుకొంచు
ఎనిమిది క్రోశంబు లేర్పడ నడిచి
అచ్చట నది దాఁట ననువైనయట్టి
యొక ప్రదేశము చూచి యుర్వీధవుండు
ఆత్మీయ సుభటుల నమ్మహాతటిని
దాఁట నాజ్ఞాపించెఁ దన్నిశీథమున.
యామ్య దిఙ్ముఖముగా నతిరయం బెసఁగఁ
బాఱెడు నయ్యేఱు పశ్చిమమార్గ
గామిన్యై మాఱిన కతమున నచట
నెలసిన దోకలంక విపినంబుతోడ
వాహినియును రెండుపాయలై పాఱు
మొదటిపాయను దాఁట భూవిభుం డపుడు
ఆత్మీయసేనకు నాజ్ఞ యొసంగె.

చటుల జంఝూవాత సాంద్రఘోషంబు
నిబిడ కాదంబినీ నిర్ఘాతరవము
ఘోరధారాసార ఘుమఘుమధ్వాన
మాబలంబులయులి వణఁచుట కతన
ఈమహోద్యమ మెల్ల నినకులేశ్వరుని
బలముల కెఱుఁగంగఁ బడ దయ్యె నపుడు.

కాన సికందరు కడు రయం బెసఁగ
జల మధ్యమున నున్న చక్కని దీవి
సైన్యయుతుండయి చయ్యనఁ జేరి
యవ్వలివాహిని నపుడు దాఁటంగ
నుద్యమం బొనరింప నొడ్డున నున్న
పాంచాల భూనాథ భటు లది కాంచి
జవనాశ్వములతోడఁ జటుల వేగమున
నేతెంచి యావార్త యినకులేశ్వరున
కెఱిఁగింప నతఁ డప్పు డిందీవరముల
గేరెడు కన్గవఁ గెంజాయ వొడమ
కాలాహియుగ్మంబు గదిసినరీతి
భ్రుకుటీయుగం బొప్ప ముఖమండలంబు
ప్రళయార్క బింబంబు పగిది వెలుంగ
ఆత్మతనూజాతు నప్పుడు పిలిచి
ఈ భంగి వచియించె నినకులేశ్వరుఁడు:

"వత్స! పాశ్చాత్యుండు వాహిని దాఁటి
వచ్చు చున్నట్టులు వార్త యేతెంచె.
కావున నీ విప్డు కడుశీఘ్రముగను
అఱువది రథికుల నయుతాశ్వికులను
దోడ్కొని పదము శత్రులు దాఁటకుండ

నాపుత్రుండును నేను నతిరయంబ బాప్ప
సైన్యంబు లన్నింటి సజ్జంబు చేసి
సంగ్రామభూమికిఁ జనుదెంచువాఁడ.
వత్స, మఱొక్కటి వచియింతు వినుము
రణపండితుఁడు గ్రీకు రాజ చంద్రుండు
కుటిలతంత్రుండును ఘోరాహవముల
నాఱితేఱిన యట్టి యధికబలుండు
సైనికు లందఱు సంగ్రామవిదులు
పాశ్చాత్త్యులకు నీకు బవరంబె మైన
నప్రమత్తుండవై యాహవభూమి
సంచరింపు కుమార! చాతుర్య మెసఁగ."
అని నిజజనకుఁ డాహవభూమి కంప
జవనాశ్వయుక్తమౌ స్యందనం బెక్కి
సైన్యసమేతుఁడై చనుచుండె నతఁడు.

ఇట సికందరుగూడ నింతటిలోన
వాహిని వడి దాఁటి బలముల నెల్ల
వ్యూహంబులుగఁ బన్ని యుద్ధసన్నద్ధుఁ
డయి వచ్చుచుండఁగ నతని మార్కొనియె
యువరాజు రయమున యోధులఁగూడ.
ఆరాజపుత్రుని యల్పసైన్యమును

గనుఁగొని యాయలెగ్జాండరు గూడ
నాహవ మొనరింప నాత్మసైన్యముల
కనుమతి నొసఁగంగ నతిఘోరభంగి
నాయుధ ధాళధళ్యంబులు మెఱయ
నొండొంటితోఁ బోరె నుభయసైన్యములు.
శరపరంపర లాకసం బెల్లఁ గప్పె
పటుసింహనాదముల్ భయదమై పర్వె
కరవాల ధారా విఖండితం బగుచు
నరకపాలావళి నభమున కెగసె.
భయదకుఠార సంపాత నిర్భిన్న
కర్కశహయ మస్తకంబులు వ్రాలి
పర్వతోపమములై పడియుండు కతన
రథములు నడుపంగ రా దయ్యె నచట,
రక్తవాహిని పాఱె రణరంగమందు.

అట్టి సంకులయుద్ధమందున గ్రీకు
లల్పసంఖ్యాకుల నారాజపుత్రు
భటుల నందఱగూడ భస్మీకరింపఁ,
క్రోధాంధ మూర్తియై క్షోణీశపుత్రుఁ
డసువుల డాపక యాహవ భూమిఁ
బటుచాప హస్తుఁడై పరబలంబులను
జిచ్చుఱపిడుగట్లు చెండాడుచుండ
నిర్ఘాత తుల్యమౌ నిశితాంబకంబు

రాజపుత్రు భుజాంతరంబు భేదించి
వీఁపున నుచ్చిపో విహ్వలుఁ డగుచు
శరచాపములు వీడి సమరాంగణమున
నసువులఁ దొరఁగియు నతఁ డప్పు డొప్పె
భానుబింబము నేలఁ బడినచందమున!

హతశేషు లైనట్టి యాశ్వికు లపుడు
పురుషోత్తమునితోడఁ బుత్త్రివధంబుఁ
దమ పరాజయమును దగ విన్నవింప

నక్షియుగ్మంబున నశ్రుబిందువులు
స్థూలముక్తాఫల తుల్యమై రాలఁ
గరతలంబున నొత్తి కనకాద్రిధైర్యుఁ
డపురుషోత్తముఁ డాత్మసైన్యములఁ
దక్షిణంబున యుద్ధధారుణీతలముఁ
జేర నాజ్ఞాపించి సిందూరముగ్ధ
మూర్ధమా గజరాజమూఁపుపై నెక్కి
కాలసర్పముఁబోలు కరవాల మొప్ప
కాంచన చిత్రిత కార్ముకం బింద్ర
చాపంబుకరణి హస్తమునందు వెలుఁగ
తపనీయమయతనుత్రాణంబు మెఱయ
గజతుండములతోడఁ గదలె భూవిభుఁడుం
సైన్యముల్ వెనువెంట సరభసవృత్తి

నడుచుచు గ్రీకుల నాశం బొనర్తు
మటు గాక యుండిన నసువుల నిత్తు
మను నిశ్చయంబుతో నాహవభూమిఁ
జేరుటయును గ్రీకుసేన యంతయును
యుద్ధ సన్నద్ధమై యుండె నచ్చోట
బలము లొండొంటితోఁ బటహనిస్సాణ
వాద్యముల్ మ్రోయంగ వడి మాఱుకొనియె.
పర్వతంబుల నైనఁ బగులింపఁజాలు
కరిఘటలప్పుడు కార్ష్ణ్యాయసోగ్ర
ముసలముల్ పైకెత్తి మోఁదుచునుండ
పదులు నూఱులు భటుల్ పడుచుండిరచట.
యవనాశ్వికులు తమ హయములతోడ
దంతావళంబులఁ దగఁ జుట్టుముట్టి
పటు శూలముల వాని బాధించుటయును
ధాతు నిర్ఝరమండితంబులై మెఱయు
గిరులకైవడిఁ బొల్చి గ్రీకుహయాళి
కరములఁ బెనచి యాకసమున కెత్తి
పలుదెసలకు వీచి వైచుచునుండె.
అప్పుడలెగ్జాండ రాత్మసైన్యములఁ
బురికొల్పి యిరుపార్శ్వముల హస్తిఘటల
మాఱొడ్డన నియమించె మహితాశ్వికులను.
వ్రణములతో గజవ్రజము మత్తిల్లి
తమసైన్యముల శత్రుదళములఁ గూడఁ

జడియంగఁ ద్రొక్కుచు జంగమభూధ
రంబులు గైవడి రణభూమిఁ దిరిగె.
బహుళశోణితనదీ ప్రవాహముల్ పాఱె!
ఆహవనిపుణుఁడౌ యవనభూనాథు
బుద్ధిబలంబునఁ బురుషోత్తమేంద్రు
సైన్యంబు రణభూమి సమసె నంతయును.
తనచుట్టు బయలైన ధరణీతలేంద్రుఁ
డాహవముఖమున నచలుఁడై నిలిచి
భద్రదంతినిఁ గొల్చి బలముల నెల్ల
సమయింపఁ జేయుచుఁ జండాంశు కులుఁడు
జ్యానాదరౌద్రమౌ చాపంబు దాల్చి
శత్రు యోధవిముక్త చండాస్త్రతతులు
ఖండంబులై పడఁ గాండముల్ వఱపి
శరపరంపర లాకసం బెల్లఁ గప్ప
భట ఘోటకాంగముల్ పఱియలై వ్రాల
మండలీకృత చాపమధ్యంబునందు
పరివేష మధ్యస్థ భానుండు వోలె
శరకర దుర్నిరీక్ష్యం బైన మూర్తి
వెలుఁగొంద వైరుల వివిధాస్త్రతతుల
ముంచి నెత్తుటఁ దేల్చి ముందఱఁ బడిన
యవనుల నందఱ జముపురంబునకు
నతిథులఁ జేయుచు నసమానశౌర్య
మంతకు నంతకు నతిశయింపంగ

వజ్రధరుండైన వాసవు రీతి
ప్రళయకాలమునాఁటి ఫాలాక్షు లీల
రావణుతోఁ బోరు రఘురాము మాడ్కి
రణ మొనరించు నారాజమార్తాండుఁ
గనుఁగొని యాయతెజ్జాండ రస్యదుర్భ్ర
తాక్రాంత చిత్తుఁడై యగ్గించుచుండె.
అప్పు డొకఁ గ్రీకు యోధాగ్రేసరుండు
కర్ణాంతికాకృష్ట ఘనచాపుఁ డగుచు
వజ్రసారం బైన పటుభల్ల మొకటి
సార్వభౌముని భుజాస్తంభంబు దూఱ
నేయుటయును నొచ్చి, యినకులేశ్వరుఁడు
శరము సంధింపంగ శక్తుండు గాక
సామజముం ద్రిప్పి చనుచుండుటయును,
సత్వరుం డై గ్రీకు సార్వభౌముండు
ఆశ్వీక సహితుఁడై యప్పుడు దేఁక
కాంచె మహాగజస్కంధంబు మీఁద
భుజ శిలాస్తంభ విస్ఫురిత శరీరు
దృఢ విశాలాంగస్కు దీప్తకిరీటు.

కవి సికందరు పల్కెఁ గౌతుకం బెసఁగ:
"పురుషోత్తమనృపాల, భూమండలంబు
దిగ్విజయార్థమై తిరిగి యనేక
రాజవీరులతోడ రణము సల్పితిని

కాని, భూనాయక, కదనంబునందు
ఇట్టి పరాక్రమం బిట్టిసాహసము
కన్నది విన్నది కాదు నే నెచట!
చాల సంతస మయ్యె సంగ్రామభీమ!
ఇత్తు నీ కియ్యది యిష్ట మద్దాని
నడుగుము రాజేంద్ర!" యని నచియింపఁ
బురుషోత్తముఁడు పల్కె. భూపాలుతోడ:
'యవనమహీపాల, యవనితలమున
దినకరకులరాజ దేవేంద్రు లెపుడు
దానధారార్ద్రిమౌ దక్షిణహస్త
మడుగున నిల్పి తా మడుగంగ లేదు
అరయఁ బ్రతిగ్రహ మ్మర్హంబు గాదు!
రాజోచితోప చారముల మన్నింపు
సమ్మతం బైనఁ బాశ్చాత్య భూపాల!''
అని వచించుటయును యవనభూపాలుఁ
డతని రాజసమున కాత్మలో మెచ్చి
"పాంచాలరాజ్యంబుఁ బాలింప నీవ
యర్హుండ వటు గాన నవనీతలేంద్ర!
నిను సింహాపీఠిక నిలిపి నీ కేను
మూర్ధాభిషేకంబు ముద మొప్పఁ జేతు!''
అని పల్కి యట్లు తా నపు డొనరించి
యతని రాజ్యము చాల నభివృద్ధి చేసి
పురుషోత్తమునితోడఁ బొందు గావించి

యతని సత్కారంబు లంది సికంద
రానందమున నుండి యచటఁ గొన్నాళ్లు
ఆ రాజదేవేంద్రు ననుమతి మీఁద
జైత్రయాత్రారంభ సన్నాహ మెసఁగ
శిబిరంబు లెత్తించి సేనలం గొనుచు
ప్రస్థాన భేరీరవంబులు సెలఁగ
దిగ్విజయార్థమై దెసలు కంపింప
బలములతో నేఁగెఁ బటువైభవమున!

# పుష్పంధయము

మదగజ గండదేశముల మాధుకరం బగువృత్తిఁ బూని త
ద్భిదుర కఠోరకర్ణహతి భృంగకుమారక, ఖేద మందగా
నిది యుచితంబె సైఁచెదె వినోదిర కోరకితాంగ వల్లినై
పొదలెవసంతుఁజూపి యిఁకఁబుష్పరసంబులఁగ్రోల్లలాముమా!

పూచె రసాలషండములు పూచె శిరీషమహీరుహంబులుం
బూచెను మల్లికాలతలు పూచెను మాధవికానికుంజముల్
పూచె సమస్తవృక్షములు పుష్పరసామృత మారగింపుమా
నీ చవు లూర షట్పద! సునిశ్చలబుద్ధి వనాంతరంబులన్.

అదె వనదేవతా తరుణు లర్ఘ్యముల న్నవపుష్పపాత్రలన్
ముదమునఁగూర్చి లేఁజిగురు ముగ్ధకరంబుల సైగసేయుచున్
మదకలకంఠనాదముల మాటికిఁ బిల్తురు నిన్నుఁ గాంచి ష
ట్పద! మధుపానముల్ సలిపి పాదపముల్ తలలూఁచఁ బాడుమా!

కుసుమ రసాసవంబులను గుత్తుకబంటిగఁ గ్రోలి భృంగ! సం
తసమున గానవార్లహరిఁ దన్పుము లోకమునెల్లఁ గాముకుల్
కుసుమశరజ్వరార్తి నినుఁ గుత్స లొనర్చిననేమి? రోగికిన్
విసమగు పాయసాన్నములఁ బ్రీతి భుజింపరె ప్రాజ్ఞులిద్ధరన్?

లస దుద్యానవనాంతరంబుల సముల్లాసంబున నూత్నతన
ప్రసవాంతర్మకరంద నిర్ఝరములం బ్రాశించి యోభృంగ! త
ద్రసమాధుర్యమెఱుంగనర్హుఁడవు! దుర్మాంసాస్థిపుంజంబుపై
ముసరంజూచెడు మక్షికంబెఱుఁగునే పూఁదేనెసారస్యముల్!

సమాప్తము

